శ్రీ మద్ది రంగనాయకులుగారు ఇండియా అంతా ఈ మూలనుంచి ఆమూలకు తిరిగి చూచారు. అక్కడక్కడి విషయాల్లోని వివరాల్ని తెలిసికోవడమే కాకుండా, వాటి సందర్భాలను విమర్శనాదృష్టితో పరిశీలించేరు. వారి అనుభవాల్ని, అభిప్రాయాల్ని, ఈ పుస్తకంలో క్లుప్తంగా, స్పష్టంగా తెలియ చెప్పేరు. దేశంలో పర్యటనం చేసిన వారికి, చేయ బోయేవారికీ కూడా ఈ పుస్తకంలో క్రొత్త విషయాలు కనబడుతాయి.

ఇటువంటి పుస్తకం తెనుగు భాషలో వ్రాయడానికి ఇదే మొదటి ప్రయత్నం. యాత్రానుభవం కలవారు రంగనాయకులుగారికి సహకారం చూపి వారివారి అనుభవాలను చేరుస్తే, ఈపుస్తకంలోని వివరాలు పెరిగి ఆంధ్రలోకానికి అధికఉపయోగకరంగా ఉండగలదు. అట్టి అభివృద్ధికై సూచనలు ఈ పుస్తకంలో ఉన్నాయి.

ముదునూరు,
30 - 3 - 42.

గోపరాజు రామచంద్రరావు.

✓

# నమస్తే.

ఇందులో ఇండియాలో గొప్పగా పరిగణించబడిన విశేషాలు—తెలిసికోవలసిన విషయాలు—ముఖ్యమైనవి—వీటికి అక్కడక్కడా అవసరమైన సూచనలు—క్లుప్తంగా క్రోడీకరించబడ్డాయి.

వీటిల్లో కొన్ని, బెజవాడనుండి వెలువడే 1938 వ సం॥ జూన్ నెల 30 వ తేదీ, గురువారం, "భారతీయ వైశ్య" పత్రికయందు "భారతదేశం—నా పర్యటనావిశేషాలు" అనే శీర్షికతో నాచే వ్రాయబడి, ప్రచురింపబడినాయి. మిగతావి క్రొత్తగా కూర్చబడినాయి.

ఇవి భారత దేశాన్నిగురించి తెలిసికొనగోరు ప్రతివ్యక్తికి తప్పక తోడ్పడుతా యని తలుస్తాను.

మద్ది రంగనాయకులు,

ఈ చిన్ని పొత్తానికి యావద్భారతదేశ పర్యటకులు—
విజ్ఞాన వేత్తలు—"నాస్తికత్వము లేక దేవుడు లేదు"
గ్రంథకర్తలు — కార్యాచరణ ధురంధరులు —

గోపరాజు రామచంద్రరావుగారు

తమ అమూల్యాభిప్రాయ మొసంగినందులకు వారికి
హృదయపూర్వక అభివందనము లర్పించుచున్నాను.

మద్ది రంగనాయకులు.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

1

# ఇండియాలో

రైల్వే గేజెస్ నాలుగున్నాయి.

(1) బ్రాడ్ గేజ్ = 5′. 6″,

(2) మీటర్ గేజ్ = 3′. $3\frac{3}{8}$″,

(3) న్యారో గేజ్ = 2′. 6″,

(4) న్యారో గేజ్ = 2′.

*

యస్. డబ్ల్యు. రైల్వే మైలేజిలో గొప్పది.

*

అన్ని రైల్వేలైన్స్ మొత్తం నిడివి 41,156 మైళ్ళు.

*

52 రైల్వే కంపెనీస్ వున్నాయి.

*

225 భాష లున్నాయి.

*

అయ్యర్ కాఫీహోటల్ లేని గ్రామంలేదు.

అంటే, కైలాసం మొదలు కన్యాకుమారివరకు వారి కాళ్ళు వున్నాయన్నమాట. కష్టపడి జీవించటానికి నడీసము ద్రంలోనైనా నేర్పుగా నివాసస్థాన మేర్పరచుకొనటానికి వెను దీయని ధీరులు.

*

బిచ్చగాండ్రు ఎక్కువమంది వున్నారు.

కనుకనే దారిద్ర్యం నటరాజతాండవం చేస్తూవుంది. ఇప్పటికైనా ప్రభుత్వంవారు ప్రజాక్షేమానికై శ్రద్ధవహించి పూనుకోవాలి. దారిద్ర్యాన్ని రూపుమాపాలి. కడుపునిండా కూడు, కట్టటానికి గుడ్డా కలుగజేయాలి.

*

584 సంస్థానాలు వున్నాయి.

చూడదగిన సంస్థానాల్లో (1) బికనీర్, (2) ఇండోర్, (3) బరోడా, (4) హైదరాబాద్, (5) మైసూర్, (6) తిరువాన్కూర్ ముఖ్యమైనవి.

*

(1) హరిద్వారం, (2) అయోధ్య, (3) ప్రయాగ, (4) కాశీ, (5) గయ, (6) కంచి, (7) రామేశ్వరం, (8) శ్రీరంగం మొదలగు క్షేత్రాల్లో పండాలు యాత్రికుల వద్దనుండి స్నాన, ప్రాయశ్చిత్త, పిండప్రదాన దక్షిణలు నిర్బంధంగా మనిషిని, వీలును బట్టి పిండేస్తారు. అందువల్ల ఫలానా మొత్తం తీసి కొంటారని నిర్ణయించి వ్రాయటానికి వీలులేదు.

పండాలు యాత్రికుల వద్దకు పొడవైన దుడ్డుకఱ్ఱలతో తయారవుతారు. వచ్చీరాని తూ, తూ మంత్రాలతో, తనివి తీరని ధనతృష్ణతో, తలప్రాణం తోక కొచ్చేవరకు యాత్రి కుణ్ణి ముప్పతిప్పలు పెట్టి మూడుచెఱువుల నీళ్లు త్రాగించి—కసాయివాని కైనా ఒకప్పుడు కనికరం కలుగుతుంది—గాని, యీ పండాల హృదయాల్లో కత్తిపెట్టి కెలికినా "కనికరం" కనపడదు—పాషాణ హృదయులు—ఒక్కొక్కరికి రెండేసి నాలుగుఅంతస్థుల మేడలు—సుక్షేత్రమైన భూములు—ఒకచిన్న పల్లెలోని పేదవారందరికి అన్నం, బట్ట యిచ్చి పోషించ గల ధనమదాధీశ్వరులు—

దగా—దబ్బర—దౌర్జన్యాలతో ధనాన్ని పట్టపగలు దోపిడీ చేస్తారు.

కాబట్టి,కఱ్ఱలను జూచి కంగారుపడి కాళ్ళను కదల నివ్వ రాదు—అచంచలమగు ధైర్యంతో నిలబడాలి—కానివ్వారు

కాబట్టి కయ్యానికి కాలుదువ్వరాదు—రాద్ధాంతంతో రచ్చకెక్కరాదు—వ్యవహారాన్ని యుక్తితో రక్తికట్టించాలి—సమయాన్నిబట్టి ముక్తి నోసంగాలి.

యాత్రికుల పాలిటి యమదూతలైన పండాల అపచారాల్ని అరికట్టించకుండా పరికిస్తూ ప్రభుత్వంవారు వూరకుంటుట చాలా శోచనీయం. సర్వాంతరవ్యాపియైన మన "విశ్వమార్క విష్ణుమూర్తి యీ యమదూతలకు తగినశాస్తిచెప్ప లేడా? ప్రజాసంరక్షణ లేదా?

*

పల్లెప్రాంతాల్లో పాములవల్ల ప్రమాదా లెక్కువ.

ఈ ప్రమాదాలు అనేక ప్రాణాల్ని గూడా హరించేస్తూ వున్నాయి. సగటున రోజుకి సల్లభై మంది పాముకాటువల్ల చనిపోతూవున్నారు.

ఇందులకై ప్రభుత్వంవారు ప్రజాసంరక్షణార్థమై తక్షణమే తగు చర్యలను తీసికోవాలి. పాముపుట్టలను త్రవ్వించి వేయించాలి. పామును పట్టితెచ్చిన వానికి ఫలానా పారితోషికం యిస్తామని ప్రతిపల్లె, పట్నంలోనూ ప్రకటింపజేస్తే, అసంఖ్యాకములైన పాములు వస్తాయి—అప్పుడు వాటిని భస్మీపటలం చేయించాలి—"పాము" అనే శబ్దాన్ని వినపడకుండా

చేయించాలి. అప్పుడే ప్రజలు నిరపాయమైన నిర్మలజీవితాన్ని గడుపగలుగుతారు.

ఉపయోగానికి బదులు ఉపద్రవాన్ని కలుగజేసేదాన్ని ఊడ్చివేయుటలో తప్పేమిటి ?

ఈ ప్రపంచంలో పగబట్టి, ప్రాణం దీయుటలో పాము లాంటి వెనుదీయని విషవిరోధిజంతువు మరొకటి లేదని మాత్రం తెలిసికోవాలి.

*

షుమారు 7,50,000 పల్లె లున్నాయి.

నూటికి 90 మంది పల్లెల్లో నివసిస్తూ వున్నారు.

*

పురుషులకు విద్య తక్కువ.

ఇప్పటికైనా ప్రభుత్వంవారు పురుషులకు నిర్బంధ-విద్యావిధానాన్ని ఏర్పరచాలి.

*

స్త్రీలకు విద్య చాలా తక్కువ.

కావలసినమట్టుకైనా, కొఱత లేకుండా స్త్రీలకు విద్య నేర్పించటం అవసరం.

విద్య విజ్ఞానంతో వియ్యమొందును—వియ్యము, నెయ్యముతో విశ్వములో చక్కని కాపుర మేర్పరచును.

*

అసభ్యసాంప్రదాయాలు, అంధవిశ్వాసాలు, అనాచారాలకూ కొఱత లేదు.

కనుకనే మన దేశం అజ్ఞానంలో లీనమై, దరిగానక, నిస్పృహతో నిట్టూర్పు విడుచుచున్నది. ప్రజానీక జీవితమంతా అధోగతిపా లవుతూవుంది.

దీనికంతకూ కారణం మనమతమే. తుదకు ఈమతం పేరిట డబ్బుకొఱకు అనేకమంది అనేక వేషాలు వేసికొని, అనేక అబద్ధాలు ఆడుతూ వున్నారు—అనేక అన్యాయాలు చేస్తూవున్నారు—అనేకహత్యలుగూడా చేస్తూవున్నారు. ఇవన్నీ నిత్యం మనం చూస్తూవున్నవే. వాటిని తల్చుకుంటే అమానుషం! అతిఘోరం!! ఇట్టి దుర్భర పరిస్థితుల సంఘటనలతో మోసమయి మగుచున్న మన మతం మరమ్మతు కావాలి. ఒక వర్గంవారి పొట్టకూటితిప్పల్ని పురస్కరించుకొని, తదనుగుణంగా తీర్చి, దిద్ది వ్రాసిన పురాణాలు పతనం కావాలి—

విత్తం, కాలాన్ని వృథాగా వ్యయపరచి, మన విజ్ఞానాభివృద్ధి కాటంకమైన కర్మసిద్ధాంతాలు కాష్ఠంలో కలవాలి—మంత్రాలతో మోక్షం వస్తుందనే మూఢవిశ్వాసాలు మంటలో కలవాలి—పైసాతో పుణ్యం వస్తుందనే పిచ్చినమ్మకాలు పటాపంచలై పోవాలి.

ప్రత్యక్ష నిదర్శనము లగు ఘటనలతో నిండిన మతాదర్శాల్ని మాత్రమే ఆచరించాలి. ఆదర్శంలోని నిదర్శనం నిత్యజీవితానికి వుపయోగపడాలి. అప్పుడే మనలోవున్న మూఢత్వం మాయమవుతుంది—విజ్ఞానం వికసిస్తుంది—జీవితం సార్థకమవుతుంది.

*

హిందూమతస్థులకున్న వివిధ రకాల దేవుళ్లు మరి ఏ యితరమతస్థులకూ లేరు.

అంటే, ప్రతిహిందువునిలో ఆస్తికత్వం బాగా ఆవరించిపోయిం దన్నమాట. దాని ప్రతిఫలమే యీ దేవుళ్లు—దేవాలయాలూ.

ఈ దేవాలయాల్లో, దేవుళ్ళ పేరుతో మేలుకంటె, మోసం ఎక్కువగా జరుగుతూ వుందంటే కోప్పడ కూడదు.

కాని, యిప్పటికైనా నిర్ధారణకు లోబడే నిక్కమైన సత్యాన్ని మాత్రం గ్రహించాలని మనవి.

*

40 కోట్లమంది జనాభావుంది.

మనమంతా నిజంగా వీరులమే ఐవుంటే—యీ బ్రిటిషు ప్రభుత్వానికి బానిసలమై బ్రతకవలసిన గతి పట్టేదిగాదు— స్వాతంత్ర్యం గూడా యిదివరకే వచ్చివుండేది.

స్వాతంత్ర్యం సంపాదించుకొనేదిగాని, ఒకరు యిచ్చేది గాదు. ఒకవేళ, ప్రస్తుత యుద్ధక్లిష్ట పరిస్థితుల్లో భారతీయులు కోరుతూవున్న ప్రకారం బ్రిటిష్ ప్రధానిమంత్రియైన చర్చిల్ వంటి ఉదారపురుషుడు యిస్తే, మనం అదృష్టవంతులమే.

లేనియెడల, యిప్పటికైనా మనం వీరులమై మనదేశ స్వాతంత్ర్యానికై నడుముగట్టి ప్రయత్నం చెయ్యాలి. ఫలితం పొందేవరకు పట్టుదలను విడువకుండా పోరాడాలి.

పైన ప్రచండయుద్ధం, క్రింద ప్రతి పలికితే ఫైర్ చేసే ప్రభుత్వం, మధ్యలో ప్రాణాల్ని బలిగోరే దరిద్రదేవత పీడ— యీ మూడింటితో మన జీవితమంతా మగ్గిపోతూవుంది. ఇందులకు శరణ్యం మన దేశస్వాతంత్ర్య సంపాదనమే.

*

"మవుంట్ ఎవరెస్ట్" ఎత్తులో గొప్పది. 29,002 అడుగులుంటుంది.

*

జమ్ము, కాశ్మీరుసంస్థానం వైశాల్యంలో గొప్పది. 85,885 చదరపుమైళ్లు వుంటుంది. ఆ సంస్థానం ప్రకృతి సౌందర్యానికి కూడా ప్రసిద్ధి పొందింది.

శ్రీనగర్‌కు 97 మైళ్ల దూరంలో వున్న వూలార్ సరస్సు పెద్దది.

*

పంజాబ్ రాష్ట్రంలో ఆడవాళ్లు తక్కువ. 1000 మగవాళ్లకు 831 ఆడవాళ్లు వున్నారు. ఆరాష్ట్రం గోధుమలకు ప్రసిద్ధి.

*

రావల్పిండిలోని మిలిటరి కంటోన్‌మెంటు పెద్దది.

*

సంయుక్తరాష్ట్రాల్లో హిందువులెక్కువ. 40, 905, 532 మందివున్నారు. ఆ రాష్ట్రాల్లో జిల్లాలు కూడా ఎక్కువే. 48 వున్నాయి.

*

ఖోజక్ టన్నెల్ పొడవులో గొప్పది. 12,870 అడుగులుంటుంది. యన్. డబ్ల్యు. రైల్వే లైన్‌మీద వున్న క్వెట్టా అండ్ చమన్ గ్రామాల మధ్యమార్గంలో యీటన్నెల్ వుంది.

*

సుక్కూర్‌లోని ల్లాయడ్ డామ్ గొప్పది.

*

హరిద్వారంనుండి బదరీనాథ్ వెళ్లేత్రోవలో యమునో త్తరిలో వేడినీళ్లధారలు ఆశ్చర్యజనకంగా వుంటాయి. ఇదే యమునానది పుట్టినచోటు. కట్టెలు లేకుండా అన్నం, పప్పూ ఉడుకుతాయి.

ఈ ధారలు చూడటానికి చైత్రమాసంలో మాత్రమే వెళ్లాలి. మిగతా సమయాల్లో మంచు ఎక్కువగా ఉంటుంది.

ఈ ధారలు గంధకధృతి ప్రదేశములపై ప్రవహించడం వల్ల ఉష్ణము జనించుచున్నది. కనుకనే, యమునానదికి ఏ నదితోనూ కలవని ప్రత్యేకత కన్పట్టుచుండును—ఆప్రత్యేక తయే "ఎవరికివారే యమునాతీరే" అనే సామెతను సార్థక పరుస్తూ వుంది.

*

హరిద్వారంలో గంగానది నీరు చాలా ఆరోగ్యప్రదమైనది. ఇక్కడ నీరు చాలా వేగంగా ప్రవహిస్తుంది.

కనుక జాగ్రత్తగా స్నానం చెయ్యాలి.

ఆనదిలో చేపలు పట్టటం బహుఅరుదు. ఇక్కడ చేపలు పైకి కనపడుతూనే వుంటాయి—నల్లగా వుంటాయి—నీటిని చాలా పరిశుభ్రం చేస్తూవుంటాయి.

అన్నినదుల్లో వుండే చేపలను పట్టకుండా వుంటే, ఆయా నదుల్లో మనవల్ల కలిగే గలీజును శుభ్రపరచి, నీటిని ఆరోగ్య వంతంగా జేయుటలో అమితంగా తోడ్పడుతాయి.

*

సింధునది పొడవులో గొప్పది. 1700 మైళ్లు వుంటుంది.

*

ఢిల్లీలోని జుమ్మామసీదు ప్రసిద్ధమైనది. 200 అడుగులు పొడుగు, 120 అడుగులు వెడల్పు, 130 అడుగులు ఎత్తు వుంటుంది.

అక్కడవున్న "కుతుబ్ మినార్" ఎత్తులో గొప్పది. 280 అడుగులు వుంటుంది.

*

కాశీలో

గంగానది మెట్లవద్ద లోతుగా కోసివుండుటవల్ల, నీటిపై

మెట్టుదిగగానే అందకపోవుట, మెట్లు పాచిబట్టి వుండుటవల్ల, కాలుజారుట తరుచుగా సంభవిస్తూవుంటుంది.

కనుక జాగ్రత్తగా స్నానం చెయ్యాలి.

ఇక్కడ యాత్రికుల స్నానసౌకర్యార్థమై, ప్రభుత్వం వారు సత్వరంగా సదుపాయాల్ని ఏర్పాటు చేస్తే మంచిది.

ఏ మూల జూచినా కొద్దో, గొప్పో తెలుగు భాషను తెలిసిన వారు — ఏ సందులో జూచినా సాధువులు, సన్యాసులు—ఏ వీథిలో జూచినా శివలింగాలకు కొఱత లేదు.

విశ్వనాథస్వామివారిని చాతుర్వర్ణ్యములవారు ముట్టుకో వచ్చును—స్వయంగా అభిషేకంగూడా చేసికొనవచ్చును.

ఈ మహావకాశం అన్ని ఈశ్వరాలయాల్లోవుంటే!...

విశ్వనాథస్వామివారి గర్భాలయంలో భక్తుల సౌకర్యార్థం ఎలక్ట్రిక్ ఫాన్ ఏర్పాటు చేయబడింది.

ఈ ఏర్పాటు అన్ని దేవాలయాల్లో వుంటే, మన ప్రాణాలు ఉక్కిరిబిక్కిరై పోకుండా ఊపిరిపోసికొంటానికి వీలుగా వుంటుంది.

కంటోన్‌మెంట్ స్టేషన్‌కు ఎడమప్రక్క కొద్దిదూరంలో వున్న ప్లాట్‌ఫారంవద్ద రైల్వే లైన్స్‌మీద నిర్మింపబడియున్న

ఓవర్ బ్రిడ్జెస్‌కు మెట్లు లేవు. చెక్కలు స్లోపుగా అమర్చ బడినాయి.

వీటిమీద ప్రయాణీకులు నడవటం బహుకష్టం. కనుక యిప్పటికైనా ఆ స్టేషన్ అధికారులు మెట్లు నిర్మిస్తే బాగా వుంటుంది.

*

మొగల్‌సరాయి - గయ రైల్వేమార్గం మధ్యలోవున్న శోణానదిమీద రైల్వే వంతెన పొడవులో గొప్పది. 10,052 అడుగు లుంటుంది.

*

నైనీలోని జైలు విస్తీర్ణంలో గొప్పది.

*

గయ రైల్వేస్టేషనులో బుకింగ్ ఆఫీస్‌వద్ద ప్రయాణీకులు ఒకరినొకరు త్రోసికొనకుండా తేలికగా టిక్కెట్లు తీసికొనుటకు తీగెలఏర్పాటు బాగా వుంటుంది.

ఇందుకు ఆ స్టేషన్ అధికారులు అభివందనీయులు. ఈ ఏర్పాటును మిగతా స్టేషను అధికారులు గూడా అనుసరించితే బాగావుంటుంది.

*

బి. యన్. డబ్ల్యు. రైల్వేలైన్‌మీద వున్న శోన్‌పూర్ రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారం పొడవులో గొప్పది. 2,415 అడుగు లుంటుంది.

*

బీహార్ రాష్ట్రం మైకాకు ప్రసిద్ధి.

*

బెంగాల్ రాష్ట్రంలో మహమ్మదీయు లెక్కువ. 27,530,321 మంది వున్నారు. ఆ రాష్ట్రం జూట్‌కు ప్రసిద్ధి.

బెంగాలీవారు కార్యశూరత్వంగలవారు. వారికి కత్తులాట పూలచెండ్లాట.

*

హౌరాస్టేషన్ విస్తీర్ణంలో గొప్పది.

*

కలకత్తా

జనాభాలో గొప్పది. 21,20,000 మంది వున్నారు.

వైశాల్యంలోగూడా గొప్పది.

## తా జ్ మ హ ల్

గీ॥ అదిగదా? దేశదేశాల యంజలింపు
లందికొన్నట్టి శిల్ప కళాపణంబు,
భారతీయుల గర్వ సర్వస్వమునకు
మూలకందము మొగలు బిబ్బీల కులుకు.

జి. జాషువ.

# తాజ్ మహల్



"........ఇది ముత్యమునుబోలు ముద్దుల మందిరము."

( 15 వ పేజి. )

ఇంపీరియల్ లైబ్రరి ఎక్కువ గ్రంథాలను కలిగివుండటంలో గొప్పది. 2,85,000 గ్రంథాలకుపైగా వున్నాయి.

*

చిరపుంజీలో ఎక్కువ వర్షంపడుతుంది. సంవత్సరానికి 460 అంగుళాలు.

*

ఆగ్రాలో

కోట అందంలో గొప్పది.

"తాజ్‌మహల్" సుందరమైన కట్టడాలలో గొప్పది.

ఈ కట్టడం ఆగ్రాకంటోన్‌మెంట్ స్టేషన్‌కు 5 మైళ్ళ దూరంలో వుంది.

దీన్ని కట్టడానికి కొన్నికోట్లరూపాయలు ఖర్చుఅయినవి—20 సంవత్సరాలు పట్టింది—20,000 కార్మికులు పనిచేసారు. ఇది ముత్యమును బోలు ముద్దుల మందిరము.

*

రాజపుటానా సంస్థానంలోని జయపూర్ హిందూ రాజ్య పద్ధతులతో పాలితమవుతూ, ప్రాచీన భరతఖండాన్ని

స్ఫురణకు దెచ్చుటలో గొప్పది. అక్కడనున్న "సన్ డయల్" గూడా గొప్పది.

*

గ్వాలియర్ కోట వైశాల్యంలో గొప్పది.

*

అజ్మీరుకు షుమారు 12 మైళ్ళ దూరంలోవున్న పుష్కర గ్రామంలో పుష్కర సరస్సునందు అసంఖ్యాకమైన మొసళ్లు స్వేచ్ఛగా చేపలవలె తిరుగుచుండును—ఒడ్డునకు గూడా వచ్చి విహారం చేయుచుండును.

ఇక్కడ స్నానం చేయటం ప్రాణాపాయం. ఈ నాటికైనా ప్రభుత్వంవారు యీ మొసళ్ళకు స్వస్తి చెప్పగూడదా?

మన ప్రాణాన్ని హరించేదాన్ని హతమార్చుట జీవహింసా ?

*

ఉజ్జయినీలో సంస్కృతం మాట్లాడేవా రెక్కువ మంది వున్నారు. ఇచ్చట పండాలు సంస్కృత పండితులు గాన, కర్మకాండలు సక్రమంగా చేయిస్తారు.

*

సెంట్రిల్ యిండియాలో బిచ్చగాం డెక్కువ.

*

గుజరాతీ స్త్రీలు వస్త్ర శృంగారంలో గొప్పవారు.

*

ఇటార్సీ, నాగపూర్ ప్రాంతాల్లో ప్రజలు ఆంధ్రులను పోలి వుంటారు. ఇచ్చట పల్లెల్లో రైతులు ఆంధ్ర దేశంలోని మెట్టగ్రామ రైతులవలె వుంటారు.

*

అజంతా, ఎల్లోరా గుహాలు శిల్పకళలో గొప్పవి.

అజంతా గుహాలు జి. ఐ. పి. రైల్వేలైన్ మీాద వున్న జలగాన్ స్టేషన్‌కు 38 మైళ్ళ దూరంలో వున్నాయి. ఈగుహాలు అర్థవలయాకారం గల 250 అడుగులు ఎత్తుగల కొండయందు నిర్మింపబడినాయి. ఇందు 28 గుహాలు కలవు. గుహాలు తూర్పు నుండి పడమటికి 600 గజాల వెడల్పు యున్నది. ఇవి ప్రాక్పశ్చిమ దేశాలను పరవశము జేసిన పరమ పవిత్ర శిల్ప కళాలయాలు.

ఎల్లోరాగుహాలు యన్. యస్. రైల్వేలైన్ మీాదవున్న అవురంగాబాద్ స్టేషన్‌కు సమీాప దూరంలో వున్నాయి. ఈ

గుహాలలోని కైలాసమందిరం తప్పక చూడతగింది. దీనిలోని శిల్పకళయొక్క అందం, ఆనందం, అనుభవాలకు హద్దులేదు.

*

బొంబాయిరాష్ట్రం కాటన్‌కు ప్రసిద్ధి.

*

బొంబాయి అందంలో గొప్పది—సర్వవ్యాపారాలకు ముఖ్య కేంద్రస్థానం.

అక్కడవున్న

(1) హార్బర్ విస్తీర్ణంలో గొప్పది. 74 చదరపుమైళ్లు వుంటుంది.

(2) విక్టోరియా ఉద్యానవనాలు విస్తీర్ణంలో గొప్పవి. 35 ఎకరా లుంటుంది.

(3) "ప్రిన్సఆఫ్‌వేల్స" మ్యూజియం సౌందర్యంలో గొప్పది.

(4) విక్టోరియా టెర్మినస్ రైల్వేస్టేషన్ అందంలో గొప్పది.

*

హైదరాబాద్ సంస్థానం పేరు కీర్తులకు గొప్పది.

*

ఒరిస్సారాష్ట్రంలోని స్త్రీలు చాలా అందవిహీనులుగా వుంటారు.

*

పూరి, మద్రాసు, రామ్నాడు సమీపంలోనున్న దర్భశయనం సముద్రాల్లో అలలు హెచ్చుగా వస్తూవుంటాయి. ఒడ్డునే అఖాతాలు, నీటిజంతువులూ వుంటాయి.

గనుక యిక్కడ స్నానం ప్రాణాపాయంతో కూడినది.

*

పూరీలో జగన్నాథస్వామివారి ఆలయంలోని విగ్రహం మంచి గంధపుమ్రానుతో తయారుచేయబడినది. స్వామివారికి ఓధుగ్రిలు కుండలతోవండిన అన్నం కుంభరాసులుపోసి నివేదన చేస్తారు. ఆ అన్నం అన్ని వర్ణాలవారు భుజిస్తారు. మడి పద్ధతి అసలేలేదు.

*

విశాఖపట్నం జిల్లా విస్తీర్ణంలో గొప్పది. 17,168 చదరపుమైళ్లు వుంటుంది.

*

బీజపూర్‌లోని "గోల్‌గుంబజ్" డూమ్సులో గొప్పది. దీని డయామీటర్ 144 అడుగులు, ఎత్తు 198 అడుగులు, విస్తీర్ణం 18,225 చదరపు అడుగులు వుంటుంది.

*

అవధానాలు ఆంధ్రభాషలో తప్ప మరి ఏ యితర భాషల్లో లేవు.

*

ముఖ్యంగా తిరుపతిలో ఏడుకొండల మీాద వేంచేసి యున్న వెంకటరమణుడు—చివరకు చిల్లిగవ్వయైనా బాకీపో కుండా వడ్డీకి వడ్డీవసూలుచేసే మార్వారీ మహాశయుడు—గవ్వ మొదలు గవర్నమెంట్ కాసు వరకు గల ధనరాసుల ఘల్లు-ఘల్లు మోతలతో, నిత్యకల్యాణం పచ్చని తోరణాలతో తుల తూగే భోగప్రియుడు శ్రీ వెంకటేశ్వరస్వామివారికి ఎన్నాళ్ళ నుండో, ఎంతో అందంగా, పట్టుకుచ్చువలె పెంచిన వెంట్రుకలను ఆడవాళ్లు, మగవాళ్లు, ఆబాలగోపాలం అందరూ గొరిగించి "మొక్కుబడి" అనే ఆచారంతో అర్పించడం చాలా హాస్యాస్పదంగా వుంటుంది—విచారకరంగా గూడా వుంటుంది.

భగవంతు డనేవాడు వుంటే—చెప్పేవాళ్లేగాని, చూసి చెప్పిన వాళ్లు లేరు కాబట్టి—అతనికి కావలసినది మనలోని ఆంతరంగికమైన నిశ్చల భక్తి గాని, నల్లని నిడివైన నీలాలు కావు.

తుదకు, వెంకన్న వెంట్రుకల మొక్కుబళ్లు తిరుపతిలో మంగలివాళ్ళకు చేతినిండా పని, సవరాల వ్యాపారావకాశమూ కల్పించింది—భక్తులను నున్నటి నిండుగుండుతో అంద

విహీనులుగా జేస్తూవుంది—అందులో కాంతలను కురూపులుగా జేస్తూవుందంటే మన్నించాలి.

ఇంతకంటె ఘనమైన ప్రయోజనం లేకపోయిన, యీ దుర్భర దురాచారానికి తర్పణం విడువమనుటలో తప్పేమిటి ?

* శ్రీ వేమన గ్రంథాలయము.
తేలప్రోలు (కృష్ణా)

అందరు దేవుళ్లూ సామాన్యంగా అష్టైశ్వర్యసంపన్నులే—అందులో దక్షిణాది దేవుళ్ళు అగ్రస్థానం వహించిన ఆగర్భశ్రీమంతులు. ఈ దేవుళ్ళందరి ధనం కలిపితే కొన్ని కోట్లు అవుతుంది—ఆ ధనంతో ప్రభుత్వంవారు ఒక పారిశ్రామికాలయాన్ని నిర్మించి, ఉద్యోగం లేక ఉసురున కేసరు పెట్టుకుంటూ వున్న అభాగ్య భారత సోదరులకు చక్కని జీవనోపాధిని కల్గింపవచ్చును. ఇందువల్ల భారతీయుల దుర్భర దారిద్ర్యం పోవటానికి ఒక మంచిమార్గం ఏర్పడుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

దేవుడి సొమ్ము తింటే, దయ్యమై బాధిస్తాడని భయపడ నక్కరలేదు.

ఈమధ్య కొన్నినెలల క్రితం భద్రాచలం శ్రీరాముల వారి తాలూకు బంగారపు ఆభరణాలు, తిరుపతిలో శ్రీ వెంకటేశ్వరస్వామివారి తాలూకు వెంట్రుకలూ ఇంగ్లాండు రక్షణా

ర్థమై ప్రభుత్వంవారు చెప్పి తీసికొంటే దేవుడు ఏమి చేసాడు? అటువంటప్పుడు, మన దేవుడి సొమ్ము మనం తింటే ఏమి అంటాడు? అంతగా, ఆయనకు కోపంవస్తే, ప్రామిసరి నోట్ వ్రాసి, మనకడుపు నిండా భోజనం, కట్టటానికి వస్త్రం ఏర్పడిన తరువాత వడ్డీతో సహా యిచ్చేద్దామని మనవిచేద్దాం.

*

మద్రాసు రాష్ట్రం విస్తీర్ణంలో గొప్పది. 1,42,277 చదరపు మైళ్లు వుంటుంది.

*

చిదంబరంలో నటరాజస్వామివారి అలంకారం నేత్రపర్వంగా వుంటుంది.

*

షిమోగరైల్వే స్టేషన్‌కు షుమారు 64 మైళ్లు దూరంలో యున్న జెర్‌సొప్ప వాటర్‌ఫాల్స్ ఎక్కువ ఎత్తునుండి పడుటలో గొప్పవి. 950 అడుగుల ఎత్తునుండి పడుతవి.

*

మైసూరు సంస్థానం బంగారానికి ప్రసిద్ధి.

*

మైసూర్ మహారాజా సంస్థానభవనాలు అందంలో గొప్పవి.

*

తిరువాన్కూర్ సంస్థానంలో చదువుకున్న ఆడవాళ్లెక్కువ.

*

కొచ్చిన్‌నుండి ట్రివాన్‌డ్రంవరకు బ్యాక్‌వాటర్స్ కెనాల్‌మీద ప్రయాణం హృదయానందంగా వుంటుంది.

*

శ్రీవిల్లిపుత్తూర్, ట్రివాన్‌డ్రంలోనూ ఆడవారు కొబ్బరి నూనె పూసికొని, చెఱువు—కోనేరులలో నగ్నంగా స్నానం చేస్తారు.

*

ట్రివాన్‌డ్రంలో స్త్రీలకు స్వాతంత్ర్యం వుంది.

*

మలబార్ స్త్రీలు సహజ సౌందర్యంలో గొప్పవారు.

*

రామేశ్వరంలోని శ్రీరామలింగేశ్వరస్వామివారి ఆలయ ప్రవేశ ప్రాకారపు త్రోవ పొడవులో గొప్పది. 4000 అడుగు లుంటుంది. ఈ గ్రామంలో కొద్దో, గొప్పో తెలుగుభాషను తెలిసినవారికి కొఱతలేదు.

# ఉత్తర ఇండియాలో

వర్ణాశ్రమ విభాగాలు తక్కువ.

*

కులాభిమానం లేదు.

*

మతాభిమానం ఎక్కువ.

*

బొట్టు బొత్తిగా పెట్టరు.

*

దృష్టిదోషం లేదు.

*

స్త్రీలు, పురుషులూ ధైర్యం కలవారు.

*

దేవాలయాలు తక్కువ. ఉన్నవి కొద్దైనా సామాన్యంగా గాలి, వెలుతురు వచ్చేటందుకు వీలుగా వుంటాయి.

*

దేవుళ్ళకు అలంకారాలు, ధూపాలు, దీపాలు, నైవేద్యాలు చాలాతక్కువ.

*

దేవుళ్ళకు ముఖ్యంగా పండ్లు, పటికబెల్లం నివేదన చేస్తారు.

*

దేవాలయాల్లో సామాన్యంగా భక్తులందరిని సమాన భావంతో చూస్తారు.

*

దేవాలయాలకు మాత్రమే ప్రాధాన్యం యిస్తారు.

*

ఆర్చీలు మంచి నిపుణతగా కట్టుతారు.

*

నదులన్నీ తాటేళ్ళమయం.

*

సరయూనది తాబేళ్ళకు సృష్టిస్థానం. ఒక్కొకసారి తాబేళ్ళు కఱుస్తవి గనుక జాగ్రత్తగా స్నానం చెయ్యాలి.

*

పథ్యానికి పర్వారుకాయ అనే పిచ్చుక పొట్లకాయ వాడుతారు.

*

"ఛా" ఎక్కువ తాగుతారు.

*

ఆడవారు అలంకారాభరణాలు సాధారణంగా ధరించరు.

*

సంగమం మితంగా చేస్తారు.

*

తీపి ఎక్కువగా తింటారు.

*

అంట్లు తోమువాండ్రు సాధారణంగా దొరకరు.

*

అరటిపండ్లు, కొబ్బరికాయలూ దొరకటం బహుకష్టం.

*

కారం ఎక్కువగా తింటే గ్రహణిరోగం ఏర్పడుతుంది.

*

గంగా, యమునా, నర్మదా నదీతీర స్నానఘట్టాలు చాలావసతి—విశాలంగా వుంటాయి.

ఇప్పటికైనా బెజవాడ మ్యునిసిపాలిటీవారు కృష్ణానదీ తీరం స్నానయోగ్యంగా చెయ్యాలని మనవి.

*

ప్రతిక్షేత్రంలో నదులను పూజించి హారతు లిస్తారు.

*

ప్రతి ధర్మశాలలో సామాన్యంగా బసచేసేగది ఒక చోట, వంటచేసికొనే గది ఒకచోట వుంటాయి. కొన్ని ధర్మ శాలల్లో బాగ్గులకుంపటి వాడితే బసచేసే గదిలోనే వంటచేసి కొనవచ్చును.

*

పందులు, తాడిచెట్లూ సామాన్యంగా కనపడవు.

# దక్షిణ ఇండియాలో . .

వర్ణాశ్రమ విభాగాలు లెక్కలేనన్ని వున్నాయి.

ఇవి చాలక యింకా క్రొత్తవి గూడా పుట్టుతూ వున్నాయి?

*

కులాభిమానం ఎక్కువగా ప్రదర్శిస్తారు.

కాని, ఐకమత్యం సున్న—ఆ కారణంగా కులకక్షలు పెరుగుతూ వున్నాయి.

*

మతాభిమానం కాగడాపెట్టి వెదకినా కనపడదు.

కనుక మహమ్మదీయుల నైనా చూచి నేర్చుకోవాలి.

ఏనాడు హిందూ, ముస్లిం మతాలు "భారతీయ మతం" పేరిట మిళిత మగునో, ఆనాడే మన దేశం బాగుపడుతుంది.

*

నడుముపైనున్న అవయవము లన్నిటికి నాజూకుగా బొట్లు చిత్రిస్తారు.

అందుకనే సాక్షాత్తు దేవుళ్ళ కౌంటర్ ఫీట్స్‌లాగా వుంటారు.

*

నూటికి తొంభైమంది నిలువుబొట్లు పెట్టేవారున్నారు.

*

దృష్టిదోషం అమితంగా అనేక విధాలుగా ఆడ, మగ వారలలో నరనరాలకు నాటుకు పోయింది.

పంపువద్ద నీళ్లు పట్టుతూవున్న అమ్మగారు, మైలు దూరాన పోతూవున్న మాలవానిని చూడటం తటస్థించితే, అంతవరకు పట్టిన నీళ్ళు అమాంతంగా పారబోయవలసిందే, శిరస్నానం చేయవలసిందే, "ఓరీ నీదుంప తెగ! నీ జిమ్మడ!! పొద్దున్నే నాపాలిటి పడ్డావేమిరా!!! ఇంక కాస్త దూరాన పోగూడదటా్రా!!!" అని వేయినాలుకలతో మంత్రపుష్పం ఉచ్చరించ వలసిందే. ఇలాంటి దృష్టిదోషం అనే మూఢ విశ్వాసాలు మనలో ఎన్నడు మాయ మవుతవో?

*

స్త్రీలు, పురుషులూ చెప్పుకోదగినంత ధైర్యస్థులు కారు. గనుకనే, ఏ ఉద్యమం లోకి దిగలేరు, పైకిరాలేరు.

*

సామాన్యంగా గుడిలేని గ్రామం లేదు.

అంటే, ప్రతివ్యక్తిలో విగ్రహారాధన మత్రిమాత్రమేవలె పాతుకుపోయిందన్నమాట. విగ్రహారాధనమంటే, ఆకాశం పైనున్న స్వర్గానికి వెళ్లటానికిగాదు—స్వర్గానికి వెళ్లి, దేవేంద్ర సింహాసనాన్ని అధిష్ఠించటానికి గాదు—అధిష్ఠించి, అమరులను పాలించటానికి గాదు—పాలించుతూ అప్సరసలతో ఆనందించ టానికి గాదు, తనను తాను తెలిసికొని, తన తనువుకు తావి చ్చిన దేశానికి తా నెట్లు నుపకరింపబడవలయునో తెలిసికొనుట. అదియే నిజమైన దైవారాధన—ఈభావం మనలో మృగ్యం.

దేవాలయాల్లోకి వాయు, సూర్య దేవుళ్లను రానివ్వరు.

అందువల్ల వారికోపాగ్నికి ప్రతీకారంగా వాటిల్లో కోట్లకొలది గబ్బిలాలు మరియు చెమట, చెడువాసననూ సృష్టిం చారు. ఇప్పటికైనా, వారిమీద ఆంక్ష తొలగించి, ఏవిధా నైనా తగిన ఏర్పాటుచేసి, లోనికి రానివ్వగూడదా? తిరు వేంద్రం అనంతపద్మనాభస్వామి వారి ఆలయంలోకి మొట్ట మొదట వాయు, సూర్యదేవుళ్ళను రానిచ్చారు. తరువాత, అస్పృశ్యులను గూడా రానిచ్చారు. ఇందుకు మనదేశ మంతా తిరువాన్కూర్ మహారాజాగారికి మంగళహారతి పట్టింది.

మహాత్ముడు గాంధి మెచ్చుకున్నాడు. ఇది అందరికి తెలిసిన విషయమే.

*

దేవుళ్ళకు రోజుకొక అలంకారం, పూటకొక ధూపం, గంటకొక దీపం, నిమిషానికొక నైవేద్యం. విరామం వుండదు.

ఈ విపరీత ఆర్థికనష్ట, అమితారాధనల తత్త్వార్థమేమిటో ? ఆంతరంగికమైన శుద్ధభక్తి ప్రధానంగాని, అనవసర బాహ్యాడంబర ఆరాధనలు అప్రయోజనములు కావా ?

*

దేవుళ్ళకు ముఖ్యంగా పులిహోర, చక్కెర పొంగలి, కట్టెపొంగలి, దధ్యోదనం, సెనగలు, వడలు, కొబ్బరికాయ నివేదన చేస్తారు.

ఇంకేమైనావుండి వ్రాయటం మరచితే మన్నించాలి. మతగురువులైవుండి, యింకా క్రొత్తరకాల పదార్థాలు ఏమైనా నివేదనం నిమిత్తం ఏర్పాటు చేయించాలని వుద్దేశ్యం కలిగితే, అవి దేవుడు ఆరగించటానికి యిష్టమైతే, పూజారికి గిట్టింపుఐతే, భక్తులు ఆప్యాయంగా తినేటట్లైతే, ఆ యా దేవాలయాధికారులకు మనవిచేద్దాం.

*

దేవాలయాల్లో భక్తులందరినీ అనేక రకాలుగా చూస్తారు.

నామాలుపెట్టికొని వారలకై ప్రత్యేకంగా సేలంలో తయారుకాబడిన 54 అంగుళాల 8 మూరల పంచలు ధరించి, బిళ్లగోచీలుపెట్టికొని "శ్రీ వైష్ణవులము" అని సంబోధిస్తూ వచ్చేవారలను విష్ణ్వంశసంభూతులుగా సంభావించి, మూడు దోసిళ్ళ ప్రసాదంతో సమ్మానిస్తారు. మిగతావారి సంగతి మిగులుగా వుంటుందని చెప్పటానికి సందేహం ఏమాత్రం వుండదు.

*

దేవుడికి మాత్రమే పాత్రిధాన్యం యిస్తారు.

*

గోపురాలు మంచి నిపుణతగా కట్టుతారు.

*

నదుల్లో తాబేళ్ళు అసలు కనపడవు.

*

పథ్యానికి పొట్లకాయ వాడుతారు.

*

"కాఫీ" ఎక్కువగా త్రాగుతారు.

*

ఆడవారు ఆపాదమస్తకం అలంకారాభరణాలు ధరిస్తారు.

*

సంగమం మితంలేకుండా చేస్తారు.

కనుకనే, బలహీనులై, సుఖవ్యాధులపా లవుతున్నారు.

*

కారం ఎక్కువగా తింటారు.

*

వైష్ణవులకు శివుడు అంటే గిట్టదు.

కనుకనే, శ్రీరంగంలో శ్రీరంగనాయకస్వామివారి ఆలయంలో కొబ్బరికాయ నివేదనకు తీసికొనరు. ఎందుకంటే కొబ్బరికాయకు మూడుకన్ను లున్నందువల్ల.

*

మద్రాసు దాటితే, అన్ని గ్రామాల్లో వంటకములలో కొబ్బరినూనె ఎక్కువగా వాడుతారు.

*

నెల్లూరులో పెన్న దాటితే పెరుమాళ్ళ సేవకు ప్రీతి.

# విఖ్యాత భారత పుత్రులు.

రాజకీయ పరిజ్ఞానంలో
మ హా త్మ గాం ధి,

పదార్థ విజ్ఞానశాస్త్ర పరిశోధనలో
సర్ సి. వి. రా మ న్,

మల్లయుద్ధంలో
గా మా ఫ హి ల్వా న్,

నాట్యంలో
ఉ ద య శం క రు డు,

తత్త్వశాస్త్రపరిజ్ఞానంలో
సర్ యస్. రా ధా కృ ష్ణ న్,

పారిశ్రామిక పరిశోధనలో
సర్ యమ్. వి శ్వే శ్వ ర య్య,

ధనమును ఎక్కువగా కలిగి వుండుటలో
హై దా ్రబా ద్ న వా బు,

శబ్దచలన చిత్రదర్శకత్వంలో
వి. శాం తా రాం.

— సె ల వు —

ప్రథమ ముద్రణ
మార్చి, 1942.

శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు (కృష్ణా)

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A104 B155 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | నో |
| ఖాళీ పేజీలు | (i, ii, iv, vi, viii, 148, 149 |
| లేని పేజీలు | నో |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | నో |
| పరిస్థితి | GOOD |

BLANKS; 38 BCI